# స్పృహ

కవితా సంకలనం





ఆంధ్ర సారస్వత సమితి
రిజిష్టర్డు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ గుర్తింపు పొందిన సంస్థ
మచిలీపట్నం

# SPRUHA

## Anthology of Free Verse

ఆంధ్ర సారస్వత సమితి ప్రచురణ— ఐదు

సంక్రాంతి – పందొమ్మిది వందల డెబ్బై అయిదు

రెండు రూపాయలు





అట్టమీద అక్షరాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ : శ్రీ భారతీ ప్రెస్, మచిలీపట్టణం

ముఖచిత్రం : నేషనల్ ప్రెస్, మచిలీపట్టణం

# 'స్పృహ' లో నడుస్తుంటే....

ఆంధ్రసారస్వతసమితి — అరవై ఆరులో పుట్టి బాలారిష్టాలు గడిచి; బుడిబుడినడకలు నడచి, డెభ్భై రెండులో విద్యాభ్యాసానికి ఉపక్రమించింది. ఆయేడు ఐదవ వార్షికోత్సవం జరుపుకుంది. ప్రత్యేకసంచిక ప్రచురణ, స్వంత మైక్ సెట్ ఏర్పాటు; గ్రంథాలయప్రారంభం— వీటితో నూతనోత్తేజం కలిగింది. సాహిత్య కార్యక్రమాల నిర్వహణలో, నిర్మాణాత్మకమైన పథకాల పురోగతిలో — వైవిధ్యం, వైశిష్ట్యం — సంతరించుకుని సమితి పురోగమనం కొత్తమలుపు తిరిగింది. సాహిత్య అకాడెమీగుర్తింపు లభించింది.

ఐదవ వార్షికోత్సవాలకి — పుస్తకప్రదర్శన ప్రత్యేక ఆకర్షణ; విజయం — అయితే; ఆరవ వార్షికోత్సవానికి (1973 డిశంబర్) హేమాహేమీలనదగిన సాహితీవేత్తలు

సర్వశ్రీ పాలగుమ్మి పద్మరాజు, మధురాంతకం రాజారాం; సోమసుందర్, రాఘవ, డాక్టర్ త్రిపురనేని వెంకటేశ్వరరావు, డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం, వేగుంట మోహనప్రసాద్- మొదలైనవారి రాక శోభాయమానమైంది.

ఏడవ వార్షికోత్సవ ప్రచురణ "తెలుగు కథ"— సర్వశ్రీ పాలగుమ్మి పద్మరాజు, మధురాంతకం రాజారాం, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, ఆర్. యస్. సుదర్శనం, శీలా వీర్రాజు, శ్రీమతి బీనాదేవిగారల విమర్శనాత్మక వ్యాస సంపుటి సమితి గ్రంథప్రచురణకార్యక్రమంలో ఒక సాహసం. లబ్ధప్రతిష్ఠులైన రచయితల వ్యాసాల్ని తెప్పించి, వాటికి సముచితమైన పారితోషికాన్ని అందించి, సంకలనంగా ప్రచురించటం నిజంగా కృత్యాద్యవస్థే అయింది. అయితే మా సభ్యుల కార్యదీక్ష, మా శ్రేయోభిలాషుల ఆదరణ, ప్రకటన కర్తల ప్రోత్సాహం మా సాహసాన్ని విజయంగా, అభ్యుదయంగా మార్చివైె. "తెలుగు కథ"కు ప్రచురణ పూర్వ విరాళాలు సేకరించి తమ ఆత్మీయతను అందించిన మిత్రుల యెడ సమితి యెప్పుడూ కృతజ్ఞతకలిగివుంటుంది.

8 వ వార్షికోత్సవప్రచురణగా సభ్యుల కవితాసంకలనం వెలువరించాలని పూనుకున్నాము. "స్పృహ" రూపు దిద్దుకో సాగింది. ఇది సభ్యుల సహకారప్రచురణ. ఇందులోని ప్రతి

రచయితా పదిహేనురూపాయలచొప్పున ఈ ప్రచురణకు పెట్టుబడిగా యిచ్చారు. మిగిలినఖర్చు సమితి భరించింది. పుస్తకాల అమ్మకంపై వచ్చిన సొమ్మునుండి ముందుగా రచయితలపెట్టుబడిని తిరిగి యిచ్చివేయాలని ఆకాంక్ష.

"స్పృహ"తో పాటు "సాక్షి"ని తమ స్వంతఖర్చుతో సమితి ఆరవ ప్రచురణగా వెలువరించడానికి మా సమితి గౌరవాధ్యక్షుడు, అధ్యక్షుడు శ్రీయుతులు విహారి & శాలివాహన సంసిద్ధులైనారు. "స్పృహ", "సాక్షి"— రచయిత లందరికీ సమితి కృతజ్ఞతలు. పుస్తకాన్ని అందంగా ముద్రించియిచ్చిన శ్రీభారతీ ప్రెస్సువారికి, నేషనల్ ప్రెస్సువారికి, నందినీ ప్రెస్సు వారికి కృతజ్ఞతలు.

"స్పృహ"కు తమ కుంచెతో మెరుగులుదిద్ది అక్షరాలంకరణచేసిన మా శ్రేయోభిలాషి శ్రీ శీలా వీర్రాజు గారి ఋణం తీర్చుకోలేము.

సమితిలో ఈనాడు మొత్తం 306 మంది సభ్యులున్నారు. అందులో 77 మంది జీవితసభ్యులు. నెలసరి పావలా సభ్యత్వరుసుము ఆర్థికంగా సమితికి పునాదికాగా— మిత్రుల, శ్రేయోభిలాషుల విరాళాలు — భారీ కార్యక్రమాలకు కోటగోడ లవుతున్నాయి.

పుస్తకప్రచురణలతో పాటు నెలనెలా సాహిత్యసభలు, సాహిత్యగోష్ఠి కార్యక్రమాలూ దిగ్విజయంగా నిర్వహించ గలుగుతున్నాం.

వీటన్నిటికీ చేయూత నిస్తున్నవారు—

ఎందరో మహానుభావులు

అందరికీ వందనాలు

సంక్రాంతి
1975

గుత్తికొండ సుబ్బారావు
కార్యదర్శి

# *కాలం కేకలెత్తి పిలుస్తున్నది

—శ్రీపతి

కారాగారపు దిక్కులు పగలబోతున్నాయి–
ధాన్యపు పాతరల ధరిత్రి రక్తసిక్తం కాబోతోంది–
అధికారపు గగనం కృంగబోతోంది–
బధిరాంధక జీవచ్ఛవాలు కదలబోతున్నాయి–
నల్లబజార్ల నల్లులు నెత్తురు కక్కబోతున్నాయి–
ఓట్ల రుచి మరిగిన ఊరకుక్కలు ఉరికెక్కబోతున్నాయి–
పెత్తందార్ల పెన్నిధుల మహోదధులు ఇంకబోతున్నాయి–
నిర్భాగ్యపు శ్రమజీవుల డొక్కలు నిండబోతున్నాయి–

అజ్ఞానపు చీకట్లలో అన్యాయపు వాకిళ్ళలో
అధికారపు చెరసాలలో జీవిస్తూ
అంగాలను దాచలేక అన్నానికి నోచుకోక
రేపటి ఆశలతో శ్వాసిస్తూ

---

* డా. సి. నా. రె. కి కృతజ్ఞతతో

పరితపించే హీనుల్ని
పలవరించే దీనుల్ని
పరిభ్రమించే భ్రష్టుల్ని
మేలుకొలిపి, మేలుపలికి
సర్వమానవ కల్యాణానికి తోరణం కట్టే
ఆయుధం చేపట్టబోతున్నాడు
మానవుడు!!!

# కత్తి నిజం

—రావ్ & యాజి

వీధి పంపులవద్ద సీనియారిటీ మీమాంసవచ్చి
తలకాయల్లాంటి బిందెలు సొట్టపడుతున్నాయి—
హృదయాల్లాంటి కుండలు పగిలిపోతున్నాయి—

బళ్ళో, నిద్రాదేవత ఒళ్ళో విశ్రాంతి తీసుకొంటూ
ఊళ్ళో, ఉద్యమాల్లో పరాక్రమించే విద్యార్థికి
పరీక్షహాల్లో కాపీల కాఫీలు స్ట్రాంగుగా అందుతున్నాయి—

జీవితాంతం క్రిందటేడాది జీతంకోసం నిరీక్షిస్తూ
గాలి భక్షిస్తూ జీవిస్తున్న ఉపాధ్యాయుడికి
పాఠం చెప్పాలనే ఆకాంక్ష బద్ధకంలా బలుస్తోంది—

లంచం పట్టకపోయినా, పుట్టకపోయినా
ఆపోశనం పట్టని సగటు గుమాస్తా
త్రికరణ శుద్ధిగా పనిమానేస్తున్నాడు—

అసిధారా వ్రతంలాంటి న్యాయనిర్ణయం
ఆంతరంగిక కారణాలవల్ల
సొరకాయకోతలా సునాయాసమవుతోంది—

సిటీలలోకి ఎంత ఎలక్ట్రిసిటీ వచ్చినా.
అదేం ఖర్మమో, బజార్లో ఎటుచూసినా చీకటే !

పరపురుషుణ్ణి పరికించినంతమాత్రాన
పాతివ్రత్యభంగమైనట్లు భార్యను శంకించే పత్తిత్తు
పదహారువేల బజారు గోపికలతో రాసక్రీడలాడుతున్నాడు

ఇదే మన సమాజం—
మనుష్యులని పేర్కొనబడే
మరో జాతి జీవాల సముదాయం !
కులమతాల కుడ్యాలమధ్య కూర్చొని
సర్వమానవ సమానత్వాన్ని జపించే
సన్యాసుల పటాలం !
రాజకీయ చదరంగంలో
బక్కచిక్కిన పేదరికపు గుర్రాల్ని బలి పశువులుచేసి
పదవీ వరప్రసాదం భుజిస్తున్న పెద్దపులుల జాలం !

ఏపనిచేసినా స్వార్థం
ఏ మాటచెప్పినా స్వార్థం
ఏది ఆలోచించినా స్వార్థం !

ఒక్క అబద్ధమాడలేక
తనను, తన తరుణినీ, తనయుణ్ణి, కిరీటాన్ని
కోల్పోయిన జాతి చరిత్ర మనది–
తండ్రి ఆనతి ఒక్కటి కాదనలేక
రాణివాసానికి బదులు పద్మాలుగేళ్ళ
వనవాసం వరించిన జాతిచరిత్ర మనది–
రక్తాభిషిక్త రణరంగ దారుణాన్ని చూచి
కృపాణాన్ని తృణీకరించిన జాతిచరిత్ర మనది–
పరాయి కిరాతకులవద్ద కిరాయి బ్రతుకుబ్రతికే

భారతీయ సోదరులకోసం
తుపాకీగుళ్ళకు గుండెలొడ్డిన జాతిపితల చరిత్ర మనది—
విశ్వశాంతికోసం అణ్వాస్త్రాలవంటిఅగ్రరాజ్యాలమధ్యకూర్చొని
తుదిశ్వాస విడిచిన పొట్టిదిట్టల జాతిచరిత్ర మనది–

ఏ మతం బోధించినా
ఏ మనీషి ఘోషించినా
ఏ మహర్షి భాషించినా
ఒకే మంత్రం, ఒకే సూత్రం, ఒకే మార్గం–
'సత్యం, ధర్మం, అహింస'

ఈ మూడు ముక్కలను అర్థంచేసుకోలేక
ఈ మూడు మార్గాలను అనుసరించలేక
ఈ మూడు అస్త్రాలను అనుసంధించలేక
మనిషి ఈనాటికి ఈస్థితికి దిగజారిపోయాడు–

ఇటువంటి మనిషి మారాలంటే–
ఇటువంటి మానవసమాజం మారాలంటే—
మనమందరం కలలు కంటున్న
రామరాజ్యానికి పునఃసృష్టి జరగాలంటే–
మనలో ప్రతిఒక్కడూ, ప్రతిఒక్కడూ,
ఒకేసారిగా, ఒక్కసారిగా
స్వార్థానికి స్వస్తిచెప్పాలి
స్వార్థపూరిత మనస్తత్వాల్ని సమాధి చెయ్యాలి–
ఆ సమాధి పునాదులపైనే
సమజీవన సహజీవన భువన భవననిర్మాణం జరుగుతుంది–

అంతవరకూ ఎవరెన్ని ఉపన్యాసాలిచ్చినా,
అపహాస్యాలే !
ఎవరెన్ని కవితా విన్యాసాలొప్పించినా
అవి కల్తీనిజాలే !



# బుద్ధుడు నవ్వాడు!

—గోపీకృష్ణ

ఛందపరిత్యక్త అయిన
తెలుగువచన కవితా తల్లికి
విశాఖలో వేసిన పెళ్ళిపందిళ్ళలో తిరిగి;
తిరిగివస్తూంటే— రాజమండ్రిలో
గోదావరి గల-గల మంది!
ఏమా అని చూతును కదా,
నన్నయభట్టారకుడు నవ్వుతున్నాడు!

× × ×

ఒక్కసారి తల పైకెత్తి
వినువీధిలోనికి వీక్షిస్తే
వేల-వేల తారలు!
రాముడు, క్రిష్ణుడు, బుద్ధుడు,
అల్లా, జీసస్, తులసీ గాంధీ
ఎందరెందరో మహానుభావులు

అంతా ఇక్కడే పుట్టారు మరి
మానవాళికి శుభసందేశాన్నిచ్చి
జీవనపథాన్ని నిర్దేశించారు
ఎంతమంది పుడితే ఏమి
ఎంతమంది గిడితే ఏమి
శని మన మనస్సులో వుండగా
మన గతికి తారలు నవ్వుతున్నాయి
విరగబడి నవ్వుతున్నాయి !

× × ×

భారతదేశం తొలిసారిగా
అణ్వస్త్రాన్ని పరీక్షించినరోజున-
నగరం నడిబజార్లో పట్టపగలు
గండ్రగొడ్డళ్ళతో మనిషి-
నరకబడ్డరోజున
బోధిచెట్టు కొమ్మల్లోంచి
వన్నని పరిహాసం విన్పించింది
తల క్రిందికివంచి చూతునుగదా,
బోధినీడ నున్న పద్మాసనస్థ
బుద్ధుడు నవ్వుతున్నాడు !

# స్వాగతం

— ఎల్. రామలింగేశ్వరరావు

స్వాగతమిదని సరిపెట్టుకోలేక,
అనుభవాల దొంతర్లపై నిద్రించలేక,
మనసులో భావాలకు మసిపూయలేక,
గతకాలం చేదు-నిజాల సింహావలోకనంతో,
అడుగుపెట్టిన నీకు
స్వాగతమిచ్చే శుభసమయాన విషాదాల విషయాలు
పూసలుగాగుచ్చి స్వగతాన్ని విప్పి చెప్తున్నా.

'వాకిటిలో, కటికచీకటిలో, ఆకలిధాటికి
మీటినస్వరానికి, పాడేపాటకు అపశృతి అలంకారం,
ప్రతిపర్వానికి అనివార్యం దిసమొలతో సాక్షాత్కారం.

మండేమంటల్నార్పాలన్నా, కండల్ని కరగించాలన్నా,
అడుగడుక్కీ ఎడబాటుచేస్తుంది లేమి గ్రహపాటు

రేసుల్లో పోర్సుల్లా- ధ్యేయానికి పరుగుల్లో
కడుపుచించుకొని వంచనయుద్ధంలో
తలవంచుకొని మించినభారంతో కుంచించుకొని
శుష్కించినదేహం ఎదురుచూపు చూస్తుంది.
కనీసకోర్కెల కొరతలతో పాతర వేస్తున్నది
మనుగడలకు జాతర ఎదురవుతున్నది
పరిష్కరించని సమస్యల్లో ఏడ్పు రాక నవ్వొస్తుంది.
నవ్వుతున్న ఏడ్పుల్లో చెదిరిన ఏకాగ్రతలో
నైరాశ్యంతో చేసిన బాణప్రయోగంలో
గుచ్చుకున్న బిందువు కేంద్రంగా గీసిన వృత్తంలో
"నేనూ మనిషే"నని ఊహించుకొని- వలయంశూన్యంలో-
సంచరించేతీరుల్లో, తడారినపెరట్లో, ఎడారిగుండెల్లో,
కెలిడియోస్కోప్‌లో రకరకాల కోణాల్లో,
అభాగ్యుని కనుచూపుల్లో విభిన్నాకృతుల్లో
కన్పించేదంతా ఎండమావుల వ్యథ.

మాడే కడుపులో మూషికసంహారానికి కావాలి అన్నం
ఆ అన్నంకోసం కామందుడిచేతిలో అల్పజీవిగానుగలోసున్నం
ఎదురుతిరిగితే అడుగడుగా హెచ్చరించే "దండం"
మనసుకు కళ్ళెంవేస్తూ క్షణక్షణం చంపుకుంటూపెట్టే దండం
ఎంగిలిమెతుకులకు కుక్కలతో పోరాటం-
సమానహక్కులకోసం, కనీసరక్షణకోసం.
ఆ ఆరాటంలో చివరకు మిగిలేది- కుక్కలుచించిన విస్తరి !

చుక్కెదురులేని అధికారికి మత్తుపానీయం మంచితీర్థం
ఏదిక్కూలేని శ్రామికునకు స్వేదజలం తులసితీర్థం
"చెప్పింది చేయకు- చేసేది చెప్పకు" ఈసంఘం రూపం
అందుకే సగటు మనిషికి ఆరిపోతున్నది దీపం
వర్తమానం పారిపోతున్నది; మనుగడ తెల్లారిపోతున్నది;
తడారిపోతున్నది; ఎడారి పెరిగిపోతున్నది;
భానుడు కృంగిపోతున్నాడు; నానుడి మిగిలిపోతున్నది'
ఈ బాధామయ గాథలతో, నిండామునిగిన వ్యథలతో
ఎంతవరకు చిందించాలి మధువులు !
స్వాగతంలో ఏమున్నా గతంలో ఏమైనా
ముఖస్తుతికోసం; ఆత్మ తృప్తికోసం;
చెప్పక తప్పదు స్వాగత మిదని.
భవిష్యత్తుబాటలో హరివిల్లు మెరవాలని;
చేదు విషాలను జీర్ణించి మకరందాలను విరజిమ్మాలని;
మనసులు స్పందించి, మమతను బంధించాలని
నవయుగానికి నాందీగా క్రొత్తఅందం పులుముకొని
ఆనందంతో నువ్వు అడుగుపెట్టిన శుభసందర్భంలో:
విరిసిన వసంతంలో కోర్కెలు నెరవేరాలని..

విధితో చేతులు కలపొద్దని- సుధతో మనసులుచిలకాలని-
నీపై ఆశలు నింపుకొని, నవచైతన్యం పుంజుకొని
అర్థించే నోటితో విధిస్తున్నా ఆంక్షలు
అందుకో నా శుభాకాంక్షలు.

గమనిక :

నువ్వు కాలానివి — నేను గాలాన్ని
నువ్వు బలానివి — నేను కలాన్ని
నువ్వు గాలానివైతే — క్షమించు! నేను ఎరను కాలేను.

## టిక్ 20

— విరియాల వెంకటేశ్వరరావు

కళ్ళుమూసి చూస్తున్న ఓ నరుడా!
బుద్ధి నీకేవుందని కులకకు
గళ మున్నదని పిచ్చిగా అరవకు!
జాతకచక్రం నీదేనని వక్రంగా భావించకు!

విశాల జగతిపరిధిలో ఏపాటిది నీశక్తి?
గంభీరవారధిలో బుద్బుద మేపాటిది?

సున్నితహృదయాలు
శిలలుగా మారిన నాటికి
ఏగతి అధోగతి; నీస్థితి- ఒక చితి!

కుయుక్తులు నీచెంత
కొంతరలుగా ఉంటేనేం?
ఆనాటికి భ్రాంతిగా మిగలకపోవు-
వ్యక్తిత్వం చచ్చిన భక్తులుకొందరు

నీ అండగ నుంటేనేం ?
ఆనాడు అసహాయత నీడగ మారకపోదు.
లోకం నీచుట్టూ పరిభ్రమిస్తుంటే
తెలియని నాకం కోసం అర్రులుచాచకు !

ఉప్పొంగే జలధితరంగాలకు
ఎదురీదితే ఏమవుతుంది ?
విడిసిపడే నీ కాయం
తూట్లు తూట్లుపడి శవంగా తేలుతుంది.

వెలలేనిది నీపుట్టుక-
వెలుగులో మసలుకో !
ఉత్కృష్టంగావచ్చిన నీవు
తోటి ఎదలకు గంట్లు పెట్టి
నికృష్టంగా పోకు !
కళ్ళుమూసి చూస్తున్న నరుడా !
కళ్ళు తెరిచి చూడు !

# మా ఊరు

— ఆంజనేయమూర్తి

అదిగదిగో మా ఊరు
జనం ఉంటారు వెయ్యినూటపదారు
అదే మా ఊరు

ఉన్నది ఒకే ఒక బడి
అదీ మూసి ఉంటుంది నెలల తరబడి
తీస్తారు తలుపులు, తుడుస్తారు బల్లలు
ఇనస్పెక్టరు వచ్చినపుడు
పిల్లలుచెప్పే తప్పులు కోకొల్లలు
ఉన్నాడు ఒకే ఒక పంతులు
ఎన్నడు అందవు అతనికి జీతాలు

ఉన్నది ఒకే ఒక గుడి
అక్కడా, పండుగపూటే సందడి
తుడుస్తారు గుడిలోని గబ్బిలాల గూళ్ళు

స్పృహ

వసూలుచేస్తారు చందాలు, వేస్తారు అందాల పందిళ్ళు
'పలారం' దగ్గిరే కుమ్ముకుంటారు రాళ్ళు.
వేసవికోసం ఎవరో మహానుభావులు
త్రివ్వించారు రెండు మంచినీటి బావులు.
లేరు డాక్టర్లు, లేరు యాక్టర్లు
కాని, ఉన్నాయి రెండే రెండు ట్రాక్టర్లు
లేవు అక్కడ చిన్న కార్లు, కాని,
వస్తూంటాయి "ఎఱ్ఱ త్రికోణం" కార్లు.
ప్రజలలో లేదని కాబోలు నిజాయితీ
ప్రభుత్వం ఏర్పరిచింది "పంచాయితీ"
తాగడానికి లేకపోయినా మంచినీళ్ళ పంపులు
తాగి తందనా లాడడానికి ఉన్నాయి సారాకొంపలు.
ఉన్నాడు ఒకే ఒక నాయకుడు యాదగిరి
బ్రతుకనిచ్చినా, బ్రతుకు తుంచినా
అతడంటేనే అందరకు గురి.
మా ఊరిలోనివారు
కల్లకపట మెరుగనివారు
ఎల్లవేళల శ్రమపడువారు
పండిస్తారు 'రత్న' 'హంస' 'జయ'లను
'పద్మ' 'ముసోరి' వరివంగడాలను
మా ఊరి గురించి చెప్పుకోవడం నావంతు.
"సర్వే జనా సుఖినో భవంతు"

# యువ తరానికో సందేశం

— కిరణ్ ప్రభ

"గురూ! బుద్ధి బద్దలుకొట్టు
తెలీదా నీకు, ఇదే స్వర్గానికి తొలిమెట్టు
పసిపిల్లాడిలా ఏమిటోయ్ సిగ్గూ
బిగించు మరో పెగ్గు!"

—ఓ విద్యార్థి సత్సందేశాలు!

"ఊర్వశిరా మనక్లాసు రాధ
ఊహిస్తేనే మదిలో అదోలాంటి బాధ
పుస్తకం తెరిస్తేచాలు; ఆ అందం
కలిగిస్తోంది ఎదలో గందరగోళం"

—మరో ప్రేమపూజారి పలుకులు!

"చెల్లించగలిగితేనే ముడుపులు
లభిస్తాయి బ్రదర్ పదవులు

ఎందుకీ అనాకానీ చదువులు
చివరికి మిగిలేవి దాహంతీరని పెదవులు"
—మరో నిరాశావాది నిస్పృహలు!

"నాకూ ఉన్నాయి పావురాళ్లవుపాడవు డిగ్రీలు
అవన్నీ ఎందుకూ కొరగాని టంగ్ క్లీనర్ లు
ఇన్నేళ్ళూ తిరిగినా లేదు ఏ ఉద్యోగం
అందుకే లాగుతున్నా రిక్షా, కూటికోసం!"
—నిరుద్యోగి పోగ్రెస్ రిపోర్టు!

"బాధలు భరించి, కష్టాలు సహించి
పరీక్ష లెన్నో ప్రాణాను రక్తం చిందించి
కానీ నాకు చేతకాలేదు పట్టడం కాకా
అందుకే తిన్నాను పెద్దఫోకా!"
—మరో సద్విద్యార్థి ఆవేదన!

ఇదీ ఈనాటి విద్యార్థిలోకం
దేశానికి మూల స్తంభమైన యువతరం!
చదివేవాడికి ఉండవు అవకాశాలు,
అవకాశాలున్నవాడికి రావు చదువులు!

అంధేరా కళాశాలలూ- అర్థాకలి చదువులూ
అయోమయ తరంగాలపై
విద్యార్థుల్ని పూచికపుల్లల్లా వదిలేస్తుంటే,
ఎలా బాగుపడుతుందీ సమాజం?

ఎలా మేలుకొంటుంది యువతరం ?

[illegible], అర్హతలనూ భూస్థాపితంచేసి

[illegible], అన్యాయాలనూ అందలం ఎక్కిస్తుంటే

ఎప్పటికీ ఇంతే ఈ దేశం !

ఎన్నటికీ లేదిక శుభోదయం !

అందుకే మేలుకోవాలి యువతరం

ముందుగా విద్యార్థిలోకం !

అర్హతలకు తగిన అవకాశం,

చదివిన చదువులకు సరైన సార్థక్యం

అందరూ సమానమై జీవించే సమాజం

స్థాపించడమే అంతిమలక్ష్యం

అందుకే కావాలి మనజీవితాలు అంకితం !



# పరిష్కారం ఎక్కడ?

—బి. శ్రీనివాసగాంధి

ఏమూల చూసినా అసంతృప్తి !
ఆర్థిక వ్యవస్థ అమావాస్యనాటి రాత్రిలా
అంతు తెలియని స్థితిలో వుంటే,
జీవనం భయంకరంగా నడుస్తూంటే,
జీవితం నడిసంద్రంలో మునిగిపోతుంటే,
ఎవర్లో చూసినా నిరాశ, నిస్పృహ
నిప్పులు కక్కుతున్నాయి !
జీవించడమే ముఖ్యమనుకున్న వారు
జీవన వ్యయంకోసం నీతిని తాకట్టు పెడ్తున్నారు,
అవినీతిని అవలంబిస్తున్నారు ;
నైతికంగా పతనమవుతూన్న సంఘం
జాతికి సహింపరాని కళంకం,
మనిషి భరింపలేని కాలకూటం ;

న్యాయం తెగలబడిపోతున్నా,
సంస్కృతి అమ్ముడుబోతున్నా,
మానవత్వం మరుగునబడుతున్నా,
స్వార్థం కోరలుచాస్తున్నా,
ఎవరికీ వాడే తనను కానట్టు
పోయేది తనది కాదన్నట్టు
తల వంచుకుని పోతున్నాడు,
తలకెక్కనట్టు చూస్తున్నాడు ;
నల్లబజారులో తెల్లని వన్నీ దాక్కుంటే,
నకిలీబజారులో తెల్లబోయి చూస్తున్నాడు.
కాలేజీల్లోని విజ్ఞానపు కళ్ళాలు
ముఠాతత్వ నాయకుల గుప్పిళ్లలో ఇరుక్కున్నాయి !
చదువుకున్న చదువును మరిచిపోతున్న
నిరుద్యోగుల్ని ముందుకునెట్టి,
నిరుపయోగ నినాదాల్ని వినిపిస్తున్న
ప్రగతినిరోధకుల్ని పట్టలేకపోతున్నారు !
మనిషిని స్వార్థం వదలకుంటుంటే
మనసు మంచిని చూడనంటుంటే
రకరకాల కాంక్షలు రక్కసిమూకలా
రక్కుతూ వుంటుంటే,
మనిషి వాటికి దాసుడై పోతున్నా
మనిషి,
తానింకా మనిషిననే చెప్పుకుంటున్నాడు—

పొరుగువాడు అప్పుకొస్తే తమ మతం పుచ్చుకోమంటున్నారు
గొడ్డలితోనే శాంతి కుదురుతుందని వాదిస్తున్నాడు ;
తుపాకీ ఒక్కటే పేదరికాన్ని తుడిచేస్తుందంటున్నారు ;
మరి పరిష్కారం ఎక్కడో ?
విజ్ఞానపుదీపాలే ఆరిపోతున్నపుడు
యోచన, విచక్షణ ఇకేం కనిపిస్తాయి ?
ఈ సుడిగాలిలో రెపరెప లాడి పోతున్న
జ్ఞానజ్యోతుల్ని ఆదుకోడానికి
అవి వెలిగి కాంతిప్రభలు విరజిమ్మటానికి.
కొందరు చెయ్యి కాల్చుకోవాలి,
ఆ కాల్చుకునే దెవరో తేలాలి !
పాలను, నీళ్లను వేరుచేసే హంసలాంటి
'సాధనం' కావాలి,
మంచిని చెడును వేరు చెయ్యడానికి !

# సమాజం - స్పృహ

— బాదరాజు శ్యామసుందర్

స్పృహ కోల్పోయిన సమాజం
ఇజాల గలీజులో ఖరాబై
[illegible]విజం బీజంగా
జనం పుడుతూ, చస్తూ
చేయరాని పనులు చేస్తూ
పడరాని పాట్లు పడుతూ
నిస్పృహతో జీవిస్తూ
అందని "యుటోపియా" ధ్యేయం అంటూ—
కలలు కంటూ, వింటూ
సమాజానికి స్పృహ కల్పించాలనే
యింకా, యింకా, ప్రతి వంకా
మహార్భటితో సాగిస్తున్నది
సంరంభం, కోలాహలం.

సమాజం మాయల ఫకీరుగాడి
మంత్రదండం దిద్దిన శిలలు—
పక్షులు, పిపీలికాలు, జంతువులు,
సరీసృపాలు, మమ్మేలియాలు.
వందలో వకరి వ్యక్తిత్వం
మందలను తయారుచేసి
కంది కంపలా ఉవ్వవేసి
కొనుక్కున్న 'ఓటు'తో—
గొణుక్కుంటున్న మేధావుల
గొంతుల ముడులకు ముడులుపెట్టి
ధర్మాన్ని నాలుగుపాదాలా నడిపిస్తున్నది,
చెరపడ్డ ధర్మం ఆక్రోసిస్తున్నా
ప్రజాస్వామ్యం ప్రవచనాల్లోనే
నివసిస్తున్నది.
సమాజప్రగతి చక్కలిగింతలా
పొలమారుతూ
మావాళ్ళెవరో నన్ను తలచుకొంటున్నారని
నెత్తిన ఓ మొట్టికాయ చరుచుకుంటున్నది.
"పిలచిన బిగువటరా" అని—
వస్తున్నదనుకున్న సామ్యవాద చదరంగం
ప్రమథగణాల పాలబడి

స్పృహ

ప్రపన్యాసాలలో శోషిల్లుతోంది.
నిజం యిజంగా మారి, నైజాన్ని –
జాతి పరం చేసే ఘట్టం
దాపులో వుందో లేదోగాని
గణతంత్ర పురోభివృద్ధి
చిత్రగుప్తుడి చిట్టాలో మటుకు లేదు.
నిరాశ నా వాదం కాదు.
పేరాస నా మతమూ కాదు.
స్పృహ కోల్పోయిన సమాజం
కనీసం ఒక్క తుమ్ము తుమ్మినా
తమ్ముళ్ళూ – నా మనసుకు సేద.
విప్లవం వుత్తమార్పు కాదు
అరవిరిసిన సరికొత్త ఆరోగ్యం.

# నాడు - నేడు - రేపు

— పొదర్తి కోటయ్య

శ్రీలు పొంగిన జీవగడ్డ ఇది
పాలు పాఱిన భాగ్యసీమ ఇది
పరమఋషులనుగన్న భూమి ఇది
పొంగిపోయాను మదిలో—
ప్రజారాజ్యమని ప్రస్తుతించాను
ప్రజలే రాజులని సంతసించాను
గాంధీమహాత్ముని వారసులు మంత్రులయ్యారని
పరవశించాను—
అహింసావాదుల రాజ్యంలో
హత్యలు జరుగవని ఆశించాను
శాంతికాముకుల పాలనలో
అలజడి రేగదని భావించాను
కాని,

# ఇది సమాజం

— కాళేపల్లి యోగేశ్వరరావు

ఇక్కడ,

ప్రజల చెమటను మద్యంగా మార్చి
విలాసాలలో మునిగిన రాజుల జీవితగాథలకు
అక్షరరమ్యత చేకూర్చిన
కవులు పుట్టేరు—
లక్షలాదిప్రజల రక్తపుటేరులలో
జలకమాడిన రాజులెందరో
వారంతా కీర్తిసింహాసనంమీద
కూర్చొబెట్టారు—

ఇక్కడ,

తెల్లని మనసుల్ని నమ్మించి
నల్లడబ్బును కుప్పలువేస్తూ

సిద్ధాంతాలు వేలకువేలు - ఆచరణలోనిండుసున్నాలు
యువతరం ముందుకురికి
ఉత్తేజంతో ఉత్సాహంతో
నవలోకం నిర్మిస్తారని
మంచిరోజు లొస్తాయని
ఆరిపోతున్న ఆశాజ్యోతికి
ఆజ్యంపోస్తూ ఆఖరిఘడియవరకు ఎదురుచూస్తుంటారని
నిన్న ఎంతటి గొప్పదైనా-నేడు ఎంత అధమంగావున్నా
రేపటికోసం నిరీక్షిస్తున్నా !



# ఇది సమాజం

— కాళేపల్లి యోగేశ్వరరావు

ఇక్కడ,

ప్రజల చెమటను మద్యంగా మార్చి
విలాసాలలో మునిగిన రాజుల జీవితగాథలకు
అక్షరరమ్యత చేకూర్చిన
కవులు పుట్టేరు—
లక్షలాదిప్రజల రక్తపుటేరులలో
జలకమాడిన రాజుల్నెందర్నో
వారంతా కీర్తిసింహాసనంమీద
కూర్చోబెట్టారు—

ఇక్కడ,

తెల్లని మనసుల్ని నమ్మించి
నల్లడబ్బును కుప్పలువేస్తూ

పదవుల చలివేందరంలో
దాహం తీర్చుకుంటున్న
పెద్దమనుషులున్నారు—
మనసు చీకటిగూట్లో
స్వార్థపు గుడ్లగూబల్ని పెంచుకుంటూ
వందిమాగధుల (వి)నాయకుల
మంగళహారతు లందుకుంటున్నారు—

ఇక్కడ,

"సర్వం మిథ్య" అంటూ
జపమాలలు తిప్పుతూ
చందాల లెక్కలకు
రెండేసిపద్దులు వ్రాస్తున్న
చిత్రగుప్తులున్నారు—
కులమతాల, చదరంగంలో
గళ్లు మారని ఘనులచేత వారంతా
పూర్ణకుంభాలు పట్టించుకుంటున్నారు—

ఇక్కడ,

"ప్రజలే నేను — నేనే ప్రజలు" అంటూ
పంచతంత్రాన్ని చాణుక్యనీతితో

రంగరించే రాజకీయ
జిత్తులమారులున్నారు—
జుట్టు అందకుంటే కాళ్లు
పట్టుకొని — లేదా
నోట్లతూకంతో వోట్లు
కొలుచుకోగలుగుతున్నారు—

ఇది సమాజం!
చిత్రకవిత్వంలో గణాలు
తప్పని పద్యపాదం!
ఇది సమాజం!



# ఎక్కడున్నావు ఓ సమతా!

— చిట్టా రామకృష్ణరావు

ఎక్కడ తలదాచుకున్నావు? ఓ సమతా!
ఎక్కడ తలదాచుకున్నావు?
అప్పుడప్పుడు మరీ నల్లపూసవుతున్నావు!
ఎంత వెదకినా కనపడవు!

నీకోరకై ఎంతెంతో వేదనపాలవుతున్నాం!
నీకోసర మెచమెచటో తిరిగితిరిగి చూస్తున్నాం!

ఎక్కడ తలదాచుకున్నావు? ఓ సమతా!
ఎక్కడ తలదాచుకున్నావు?
అప్పుడప్పుడు మరీ నల్లపూసవుతున్నావు!
ఎంత వెదకినా కనపడవు!

స్వాతంత్ర్యదినోత్సవాల సుభాషితాల్లోనా?
స్వదేశీయ విదేశీయ సమైక్యతలోనా?

ప్రపన్యాసాలలో శోషిల్లుతోంది.
నిజం యిజంగా మారి, నైజాన్ని—
జాతి పరం చేసే ఘట్టం
దాపులో వుందో లేదోగాని
గణతంత్రి పురోభివృద్ధి
చిత్రిగుప్తుడి చిట్టాలో మటుకు లేదు.
నిరాశ నావాదం కాదు.
పేరాస నామతమూ కాదు.
స్పృహ కోల్పోయిన సమాజం
కనీసం ఒక్క తుమ్ము తుమ్మినా
తమ్ముళ్ళూ — నా మనసుకు సేద.
విప్లవం వుత్తమార్పు కాదు
అరవిరిసిన సరికొత్రి_త్త ఆరోగ్యం.



# నాడు - నేడు - రేపు

— పొద్దుత్తూరి కోటయ్య

శ్రీలు పొంగిన జీవగడ్డ ఇది
పాలు పాఱిన భాగ్యసీమ ఇది
పరమఋషులనుగన్న భూమి ఇది
పొంగిపోయాను మదిలో—
ప్రజారాజ్యమని ప్రస్తుతించాను
ప్రజలే రాజులని సంతసించాను
గాంధీమహాత్ముని వారసులు మంత్రులయ్యారని
పరవశించాను—
అహింసావాదుల రాజ్యంలో
హత్యలు జరుగవని ఆశించాను
శాంతికాముకుల పాలనలో
అలజడి రేగదని భావించాను
కాని,

అంచనాలన్నీ ఎండమావులైనాయి
ఆశలన్నీ నిరాశలైనాయి
పయోముఖవిషకుంభాల పాలనలో
శాంతిలేదు, ప్రశాంతిలేదు
అధికధరలు అందలమెక్కితే
ప్రాణిజీవితం ప్రమాదంలో పడిపోయింది
పదిలంలేని యీ ప్రపంచములో
కళ్ళులేని ఈ న్యాయస్థానాలు
ధనమదాంధులకు పెంపుడుబిడ్డలుకాగా
నిర్దోషికి తగు భద్రతలేదు
నిజాయితీపరులకు నిలువ నీడలేదు
ధనికవర్గాలను దరిచేరనీయరాదంటూ
దరిద్రాన్ని రూపుమాపుతామంటూ
బంజరులను పంచిపెడ్తామంటూ
తలదాచుకొనుటకు యిల్లు యిస్తామంటూ
వెనుకబడినతరాన్ని వెళ్ళగొడ్తామంటూ
దరిద్రులను దగ్గరకుచేర్చుకుంటూ
దారిఖర్చులకు ధన మిమ్మంటూ
దర్జాగా ధనమార్జించే వినాయకులు
దేశోద్ధారకులై పోతున్నారు
"కరుణాసముద్ర"లని భట్రాజపొగడ్తలుపొందుతున్నారు

సిద్ధాంతాలు వేలకువేలు - ఆచరణలోనిండుసున్నాలు
యువతరం ముందుకురికి
ఉత్తేజంతో ఉత్సాహంతో
నవలోకం నిర్మిస్తారని
మంచిరోజు లొస్తాయని
ఆరిపోతున్న ఆశాజ్యోతికి
ఆజ్యంపోస్తూ ఆఖరిఘడియవరకు ఎదురుచూస్తుంటారని
నిన్న ఎంతటి గొప్పదైనా-నేడు ఎంత అధమంగావున్నా
రేపటికోసం నిరీక్షిస్తున్నా !



# ఇది సమాజం

— కాళీపల్లి యోగేశ్వరరావు

ఇక్కడ,

ప్రజల చెమటను మద్యంగా మార్చి
విలాసాలలో మునిగిన రాజుల జీవితగాథలకు
అక్షరరమ్యత చేకూర్చిన
కవులు పుట్టేరు—
లక్షలాదిప్రజల రక్తపుటేరులలో
జలకమాడిన రాజులెందరో
వారంతా కీర్తిసింహాసనంమీద
కూర్చొబెట్టారు—

ఇక్కడ,

తెల్లని మనసుల్ని నమ్మించి
నల్లడబ్బును కుప్పలువేస్తూ

పదవుల చలివేందరంలో
దాహం తీర్చుకుంటున్న
పెద్దమనుషులున్నారు—
మనసు చీకటిగూట్లో
స్వార్థపు గుడ్లగూబల్ని పెంచుకుంటూ
వందిమాగధుల (వి)నాయకుల
మంగళహారతు లందుకుంటున్నారు—

ఇక్కడ,

"సర్వం మిథ్య" అంటూ
జపమాలలు తిప్పుతూ
చందాల లెక్కలకు
రెండేసిపద్దులు వ్రాస్తున్న
చిత్రగుప్తులున్నారు—
కులమతాల, చదరంగంలో
గళ్లు మారని ఘనులచేత వారంతా
పూర్ణకుంభాలు పట్టించుకుంటున్నారు—

ఇక్కడ,

"ప్రజలే నేను — నేనే ప్రజలు" అంటూ
పంచతంత్రాన్ని చాణుక్యనీతితో

రంగరించే రాజకీయ
జిత్తులమారులున్నారు—
జుట్టు అందకుంటే కాళ్లు
పట్టుకొని — లేదా
నోట్లతూకంతో వోట్లు
కొలుచుకోగలుగుతున్నారు—

ఇది సమాజం!
చిత్రకవిత్వంలో గణాలు
తప్పని పద్యపాదం!
ఇది సమాజం!

# ఎక్కడున్నావు ఓ సమతా!

— చిట్టా రామకృష్ణరావు

ఎక్కడ తలదాచుకున్నావు? ఓ సమతా!
ఎక్కడ తలదాచుకున్నావు?
అప్పుడప్పుడు మరీ నల్లపూసవుతున్నావు!
ఎంత వెదకినా కనపడవు!

నీకోసరకై ఎంతెంతో వేదనపాలవుతున్నాం!
నీకోసర మెచమెచటో తిరిగితిరిగి చూస్తున్నాం!

ఎక్కడ తలదాచుకున్నావు? ఓ సమతా!
ఎక్కడ తలదాచుకున్నావు?
అప్పుడప్పుడు మరీ నల్లపూసవుతున్నావు!
ఎంతవెదకినా కనపడవు!

స్వాతంత్ర్యదినోత్సవాల సుభాషితాల్లోనా?
స్వదేశీయ విదేశీయ సమైక్యతలోనా?

వీధులలో మార్మ్రోగే నినాదాల్లోనా?
బహిరంగ సభాపూజ్యుల వాగ్దానాల్లోనా?
వేదికలపై వెల్లివిరిసే సెలయేరుల్లోనా?
సంక్షేమవరాలు పంచు శాసనాల్లోనా?
ప్రగతిపథం చాటించే కరపత్రాల్లోనా?
సుగతికి ఆశలుచూపే ప్రముఖుల సూక్తుల్లోనా?

ఒకనాడొక దేశమాత ముగ్గురు మణుల కన్నదిగద!
వారిలోన ఓ సమతా! నీకు స్థాన మున్నదికద!

ఎన్నెన్నో సీమలలో ఎంతో విజ్ఞానమా!
నిత్యజీవితము చూడగ అంతగ అజ్ఞానమా!

ఆదర్శాల్ ఉపదేశాల్ ఎంతెంతో పెరిగినవే!
ఆచరణల్ అనుసరణల్ అంతంతగ తరిగినవే!

తమచదువులు గొప్పవనుచు ఢంకా మ్రోగించువారె
తమ సంస్కృతిమాట మరచి తమోవీధి తిరుగుదురే!

మానవతా వాదమునకు మనమది పొంగుచున్నది
మానవభేదములనుగని మనయెద కృంగుచున్నది!

చూడచూడ ఓ సమతా! ఏ వాడలో తావున్నది?
ఏ పవిత్రక్షేత్రంలో నీకు నీడ నెలకొన్నది?

ఎంతో ఎత్తున తారామండలంలో ఉన్నావా?
పాతాళంలో ఎంతోలోతున దాగున్నావా?

దిక్కులున్న ప్రపంచంలో దిక్కులేక ఉన్నావా?
ఎక్కడైన ఓక్కచోట మచ్చుకు అసలున్నావా?

ఏమీ! నిన్నెంతపిలిచినా మరి పలుకవుగా!
మూగతనంవచ్చిందా? రాగతనంహెచ్చిందా?

నిన్నెంతో ప్రీతిమాలిన కన్నతైనా చూడవు!
అసమానత చూడలేక కళ్ళు మూసుకున్నావా?

ఎక్కడచూచిన బలిసిన అక్రమాల తొక్కిడులకు
ఉక్కిరిబిక్కిరియై ఆత్మహత్య చేసుకున్నావా?

చనిపోయావనుకున్నాం! కనులనీరు గుర్కుకున్నాం
కొనఊపిరితో ఉన్నావని ఒక మహాత్ముడన విన్నాం!

ఆ మహాత్మునితో నీవును ధరణి విడిచిపోయావా?
క్రొత్త సూర్యచంద్రులతో తావు చేసుకున్నావా?

ఎంతకాల మీరీతిగ చింతలపాలగు లోకం?
అంతరించదా యిక యీలోకపు చీకటిశోకం?

అంతర్వీక్షణ జనులకు కొంతైనా ఉన్నట్టా?
ప్రళయాంతకమైన దానవత్వమె మన పైమెట్టా?

జాతుల కికదారేదీ? నీతుల కిక ప్రీతు కేదీ?
అంతర్జాతీయ శాంతిసౌఖ్యాలకు గతియేదీ?

ఎక్కడ తలదాచుకున్నావు? ఓ సమతా!
ఎక్కడ తలదాచుకున్నావు?
అప్పుడప్పుడు మరీ నల్లపూసౌతావు!
ఎంత వెదకినా కనపడవు?

# *తెలుగు వాచకము

— స్వర్ణరాజ హనుమంతరావు

శ్రీలు పండిన రత్నగర్భ రాయలసీమ
అందాలు తెలుగుతీయందనాలొలుకు ప్రాగాంధ్రభూమి
అచ్చంపు తెలుగుమాగాణము తెలంగాణము-కలసి
త్రిలింగసంజ్ఞతో తేజరిల్లినదీ తెలుగుపరసీమ

తెలుగుజాతి మనుగడ పురాణసంప్రశస్తము
తెలుగుదేశ చరిత్ర నవరససంభరితము
తెలుగుభాషాయోషాకృతి శిరీషకుసుమపేశలము
తెలుగుజాతి హృదయము నవ్యనవనీతసదృశము
తెలుగు- మాధుర్యానికి సరియైన పర్యాయపదము

తెలుగుపొలాలు అన్నపూర్ణ అక్షయకలశాలు
తెలుగుకలాలు అరివీరులకు ఆఖండలు కులిశాలు
తెలుగుఇల్లాలు ఒడి నగ్నినిలుపగల పవిత్రురాలు
తెలుగుబాలురు సర్వసర్వంసహాచక్ర మేలగల ధీశాలురు

---

* ఆకాశవాణి, విజయవాడ సౌజన్యంతో

తెలుగువారి హృదయాలు దేవాలయాలు
తెలుగువారి ఇళ్లు కళానిలయాలు
తెలుగు నగరాలు కమలాలయాలు
తెలుగు నదులన్నీ పవిత్రతీర్థాలు
తెలుగు సీమలెల్ల పుణ్యక్షేత్రాలు
తెలుగు వనాలు నందనాలు

నన్నయ భారత ప్రసన్నోక్తి నాజాతికి శ్రుతి
నారాయణరెడ్డివరకు నావరకు నడిపిస్తోందదే ప్రగతి
నన్నయాదుల భారతముతో నాకనుజన్మ ప్రసాదించిన
నారాయణునకు చెప్పుకుంటా నొక్క నమస్కృతి.

కర్ణాటకసంప్రదాయ సంగీతానికి మధురమంజులమగు
ఆకృతి కలిపించి నిలిచింది తెలుగు త్యాగరాజుసుకృతి

సంగీత సాహిత్యాలకు భరతముతో త్రివేణీసంగమము జేసి
పదసాహిత్యానికి పథము వేసినది ప్రాజ్ఞుడు క్షేత్రజ్ఞుడు
యోగముద్రధరించినను రసజ్ఞానవిద్యలో సిద్ధిపొందిన
సిద్ధేంద్రయోగీశ్వరు నాట్యకళాసిద్ధాంతోపదేశసారము

అఖిలభారత నాట్యకళాక్షేత్రాల ప్రేక్షకులనలరిస్తోందీనాటికీ
పట్టడి చూదామాకలాపమని పందెంచరుస్తుం దేనాటికీ !

కాకతీయశిల్పంలో జీవించిన నాట్యేందిరలసొంపు
వసంతరాయలపేరులో కర్పూరపు గుబాళింపు
కృష్ణరాయల కీర్తిమూర్తి తలచిన కలుగు పులకరింపు
భవిష్యదాంధ్రజనావళి భావపథాల పన్నీటి చిలకరింపు

ఇది తాజమహాలుకట్టిన శిల్పులు పుట్టినదేశము
ఇది వ్యాసాగస్త్యాదిఋషులు మెట్టినదేశము
ఇది అణువణువున రామపాదాంకితమైనదేశము
ఇది అనుక్షణము అక్షరాక్షతల పూజలందుకున్న దేశము

అయ్యంగారి చక్రాంకితాలామోదింపక
వేంకటేశుడు సంకటనాశుడై
నమ్మితే వమ్ము చేయనన్న అభయహస్తముద్రతో
త్రైపత్యము వహించిన తెలుగుభూమి యిదే యిదే

అక్షరజ్ఞానముగల అర్చకునిచేతసైతము
అక్షరతేజస్వినీ దివ్యదర్శనముచేయించిన
సౌభాగ్యకామేశ్వరీ పదసమారాధనాతత్పరులు
పరిష్కృత సచ్ఛాత్రసంసేవిత భవ్యకవితావేశులు
తిరుపతి వేంకటకవుల దివ్యకవితారసధుని పారి
సాహితీబంధుసింధువుచేరు సంగమక్షేత్రమిదే యిదే!

వేయిపడగలు విప్పారుకొని నిలచిన విశ్వనాథక్షేత్రాన
ఆర్షధర్మలింగేశ్వరాలయానికి అంగన్యాసమైంది
జగన్నాథుని రథమార్గము జగతిచేరువకు వచ్చి- యిట
జనతావేదనా నివేదనను మహితాత్మకరముసాచిగ్రహించింది

తిక్కన తెలుగుసీమదాటి జన్మింపడు
వేమన తెలుగుగడ్డమీదతప్ప కనుపింపడు
గిరీశం తెలుగుభూమిలోతప్ప నివసింపడు
ఈశుడు త్రిలింగసంజ్ఞనింక నేరికీ ప్రసాదింపడు.

తలకట్టు కలిగిన దేవుడు శ్రీకాకుళాంధ్రమహావిష్ణువు
తలకట్టు కలిగి వర్ధిల్లినది తెలుగుఅక్షర తేజస్విని
తలగట్టి భాషారాష్ట్రలకు అగ్రతస్యముద్రించిది ఆంధ్రుకు
తలగట్టుకొని నిలబడగల ధైర్యస్థైర్యాలు తెలుగువానిసొమ్ము.

ఈమూాల ఆనందకాననం నిండుగా పూచింది
ఇటనుండి సాహితీసౌరభము మత్తుగా వీచింది
మజ్లిన చాందినీల చలువపందిళ్లలో
కలంకారీ అలంకారము కనులపండువుచేసింది.

అమరజీవి శ్రీరాములు ఆంధ్రజ్యోతి వెలిగించిననాటినుండి
ప్రకాశమానమై, పునస్సంజీవితమై, ధర్మగోపాయితమై
బ్రహ్మానందసహోదరానందాన్ని పంచియిచ్చిన పవిత్రమూర్తి
అందాల తీయందనాల అమృతవల్లి! తెలుగుతల్లి !



# నగ్న సత్యం

— కోడూరు శ్రీపాండురంగారావు

విశ్వమానవకల్యాణమంటూ
వేయిగొంతులు అరుస్తున్నాయి

సర్వమానవ సౌభ్రాతృత్వమంటూ
పదేపదే పలవరిస్తున్నాయి

ప్రతిరోజూ వేదికలెక్కి ఎండమావుల్లా
సోషలిజం ప్రతివ్యక్తినీ ఊరిస్తోంది

ధరలుమాత్రం ప్రతిక్షణం గుర్తింపుకోసం
పై పైకి ఎగబ్రాకుతున్నాయి

త్యాగానికి కుచ్చుల తురాయి పెట్టాం
దేశసేవకి జరీకండువా వేశాం
అందరికీ సమానహక్కులంటూ కలవరిస్తున్నాం
అంతకంతకీ అధోగతిలో పడిపోతున్నాం

సోమశిలలు భూమిపై పడి దొర్లుతున్నాయి
కుజుని చిత్రాలు యింటింటా కన్పిస్తున్నాయి
సెటిలైట్‌తో వార్తలు ప్రసారం చేస్తున్నాం
కాని తిండికి గింజలడిగితే తెల్లమొగం వేస్తున్నాం

రోజురోజుకీ పెరిగిపోతోంది మన ఆశ
నానాటికీ తరిగిపోతోంది మన శ్వాస
ఎవ్వరేమన్నా యిది నగ్నసత్యం
మార్చుకోకుంటే లాభంలేదు మన మనస్తత్వం

ఏది ఎంత ఎదిగినా
ఎవరు ఎంత పెరిగినా
సగటుమనిషి గొంతుకు
తోకమాత్రం బెత్తెడే!



# ఆపండి ఇక చాలు!

— జె. ఎస్. ఆర్. కె. ప్రసాదరావు

వ్రేలముల మాడే కడుపులలో
ఆకలిమంటలు జ్వలిస్తుంటే
ఉపన్యాసాల మత్తుమందులు
ఉపశమనం కలిగిస్తాయా?
ఉపాహారాన్నందిస్తాయా?
సోషలిజం ముసుగేసుకుని
కమ్యూనిజం రగ్గు కప్పుకుని
దేశాన్నుద్ధరిస్తామంటూ
తమ ఆదేశాలు చలామణీ అవ్వాలని
ఆరాటపడే నాయకమ్మన్యుల
లోగుట్టుల బట్టబయళ్ళు
సామాన్యుడి మేధస్సుకు తెలియకనా!

సామాన్యుడి కొలబద్దకు అందకనా ?
దేశం ఏమయితే తమకేమని
దేశం తమ జేబూలో సొత్తని
సొంతంగా అతిపదిలంగా
దాచుకోవాలని చూచుకునే
దోచుకోవాలని కాచుకునే
స్వార్థపరుల గారడీల కిటుకులు
అవగాహనకానిది ఎవడికి
ఆవేదనచెందని దెవరని ?
మనదేశంలో, యువతరంలో
విప్లవజ్యోతులు వెలిగించాలని
ఆరనిజ్యోతులు వెలిగించాలని
ఆరని దీపశిఖలలో చమురును
నిత్యం పోయాలని
ఆవేశం కట్టలు తెంచుకునేలా
అవకాశం చేజిక్కించుకునేలా
ఉపన్యాసాలవేదికలపై
వినిపించే వాక్ఝరులు
సామాన్యుడి ఆర్తిని అరికడ్తాయా ?
సామాన్యుడి కడుపును నింపిస్తాయా ?
మనదేశంలో తెల్లారిందిమొదలు
ఏమూలలో ఒకమూల ఉపన్యాసాలగోలలు

రాజకీయనాయకుల హేలలు
ఒక బ్రాందీషాపు ఓపెను చెయ్యడానికి
మంగలిషాపులు తెరవడానికి
వీధిచివర చెత్తకుండీ లుంచడానికి
నమిలిపారేసిన ఎంగిలాకులు
తుడవడానికి
ప్రతిపనికి ప్రతిరోజూ ఒక సభ
ప్రతిపూట ఒకమైకులో ఒక రొద!
ప్రగతిలేని నీతిలేని
ఉపన్యాసాలగోలలు
ఇంకెందుకు ఇంకెందుకు?
ప్రతినిత్యం పట్టెడన్నం
కడుపునిండా నింపే ఉద్యమం
కొనసాగితే ఇకచాలును!
ప్రతి మనిషికి ఒక కొంపాగోడు
ఉండే ఏర్పాటులు చాలును
మాటలలో కాలం
ఖూనికాకుండాఉంటే చాలును
మాటలలో పచ్చినిజం
చేతలలో చూపిస్తే
అదే నేటి ప్రగతికి ఒక మార్గం
అదే నేటి యువతకు ఒక వరం!



# స్వాపతేయం

—విజయమూర్తి

అందమైన అలకాపురి జేరుకోవాలని
అందరికీ ఆశ ఘనంగానే వుంటుంది!—

మా ఊరికి ఉత్తరాన
మర్రిచెట్టొకటి కనిపిస్తుంది.
అది చాలా చిత్రవిచిత్రంగా వుంటుంది.
తూర్పుదిక్కునున్న కొమ్మ మొదట్లోకి
పిడుగుపడి ఏనాడో విరిగిపోయింది.
దక్షిణదిక్కు నున్న కొమ్మ కొంచెం ఎదిగి,
ఆగిపోయి కాలిఆరిన కొరకంచులావుంది.
పడమటిదిక్కునున్న కొమ్మయితే ఎదగిందిగానీ,
పూర్తిగా నీటిలో మునిగిపోయింది.
ఇక మిగిలిన ఉత్తరదిక్కుగానే ఆ చెట్టంతా
శాఖోపశాఖలుగా పెరుగుతోంది.

వివరించిన విజ్ఞానవిదులు
అనుగమించిన అనుభవజ్ఞులు
అంతా చెప్పింది, చేసిచూపింది ఒకటే !
ఆ ఉత్తరపుకొమ్మ వెంట చాలాదూరం సాగాక
ఎన్నెన్నో సాహసకృత్యాలు చేసాక
అలకాపురిలో శాశ్వతపీఠం సాధించవచ్చుట !—
అలకాపురంటే అందరికీ ఆశ కలుగుతుంది.
అలవోకగా అలాంటిపీఠాన్నందుకోవాలని
అలరించిన మనస్సు ఉవలాటబడుతుంది.
అందుకే నామనస్సూ ఉరకలు వేసింది.
తీరా బయల్దేరాక చాలా భయమేసింది !—
నలభై అడుగులదూరంనుంచే
అలముకున్న అంధకారంలో
పులుగుపిట్టల భయంకరనాదాలు,
అడుగుతీసి అడుగు వెయ్యగానే
అగ్నితుండులు కసిగా కాల్చిరేపే మంటలు,
రవ్వంతసడి వినగానే
కస్సునలేచి బుస్సుమనే పాముల ఫూత్కారాలు,
ఇంకా మొండిగా ముందుకుపోతే
నాలుగు బారలుకలిసి వలయంగా అమరిన కైవారంలో
నాలుగుముఖాల భీకర భూతరూపంలో
భీతావహంగా వున్నస్కందం.

అంతేకాదు !—

తూర్పుదిక్కున తళుక్కుమని తిరిగిపోయే తటిల్లతలు,
దక్షిణదిక్కున దండరూపంలో చుట్టుకుంటున్న
చక్షుశ్శ్రవాలు,
పడమటిదిక్కున పిశాచరూపుల పాశపట్టెడలు.
ఉత్తరదిక్కున ఉమ్మలించే ఉవిదనాదాలు,
ఇవన్నీచూసి గుండె బేజారైపోయింది.

ముందుకు అడుగు సాగకపోయింది.
గుండె చేతబట్టుకుని వెనక్కి వెనక్కి వెళ్ళాను.

హఠాత్తుగా భుజాని కేదో తగిలింది.
కెవ్వున కేకవేసి కలయజూసాను.
ఊపిరిపీల్చి ఊడని పోల్చుకున్నాను.
చటుక్కున మెరిసిందో చంచలచదరం !

చీకటి చీల్చుకుని చూస్తే కనుపించిన వలాంటి వనేకం !!
ఒకటి, రెండు, మూడు ప్రయత్నాలయాయి.

ఆఖరిసారిగా ప్రయత్నించాలనుకున్నాను.
ప్రక్కనున్న ఊడబట్టి ఎగబ్రాకుతున్నాను.
ఇంకొక్కక్షణంలో చిక్కుతుంది కొమ్మని
అంతు తెలియని ఆనందంపొందిన స్వాంతం
ఊడ తెగగానే ఉమ్మలించింది సాంతం. —

నడుంజారిందో యేమోగానీ
నిటారుగా నిలబడాలనుకుంటే
కటారి యేదో పొడిచినట్లయింది.

ఒంటిగా వెదకిన ఆశ ప్రక్కన
జంటగా నిరాశ పకపకా నవ్వింది.
మింటి వెలుగుకోసం మీదికిచూస్తే
ఇంటి ( ! ) నిండా ఇరులు కమ్మేసింది.

వేయినాలుకలు జాచిన స్వాపతేయభూతాన్ని
హృదయంలో వెలిగిన చిగురంత ప్రేమదీపం చిదిమివేసింది.
లీలగా కనిపిస్తోందిక సోపానపథం
గోముగా ఆహ్వానిస్తోందిక మానవత్వపు ధనం.

# పండగ సంబరం

—పి. చిరంజీవినీకుమారి

భగ్గున మండే మంటల్లో వణికించే చలిగాలులు
గజంలోతుకుపోయిన కడుపులు
పండించిన బంగారు ధాన్యరాసులు
మిలమిలలాడుతూ ఎగురుతున్న తప్పలు
గోడౌన్లలో మాయమౌతున్న ముత్యాలపోగులు
సంక్రాంతిసంబరాలు మొదలయ్యాయి.
లోపల కైబెరాడాన్సు జరుగుతోంది
బయట సాతానిజియ్యరు పాడుతున్నాడు.
సంక్రాంతి రేడియో అరసున్నలో
బండి ఐ నుపెట్టి అరగదీస్తోంది.—
లేస్తోంది లోకం పొడుస్తోందిశోకం వస్తోందినాకం—
చప్పట్లు చరుస్తున్నా డొక దుర్వాసుని మేనల్లుడు
అది అరవిడుస్తున్నగులేతలాబీ

రథాలు మళ్లుతున్నపుడు దానికి రంగు ముదురుతుందని
అంటాడొక కళావేత్త—
క్రాంతిరథం కదులుతుంది
జనవాహిని చేతులపై శ్రమశక్తుల ఊపిరితో
క్రాంతిరథం సాగుతుం దంటాడొక తత్త్వవేత్త -
రామదాసుభార్యల్లాంటి మేధావులు
యూనివర్సిటీ కసవుని గంపల కెత్తుకుంటూ
రథాల్ని ఆగమంటున్నారు—
చంద్రుణ్ణితాకిన విజ్ఞానంమధ్య అధికారబధిరత్వం
కులతత్వ శవజాగరం -
ఈనాటి సంక్రాంతిన వ్యాఘ్రాలు
గోవులముఖాలకు పసుపురాస్తున్నాయి—
శృగాలాలు గొబ్బెమ్మలు పెడుతున్నాయి
గుడ్లగూబలు స్మశానంలో బొమ్మలకొలువు తీరుస్తున్నాయి.



# నిరీక్షణ

—జి. సత్యనారాయణ

పాడుబడిన గ్రామంమధ్య పడగొట్టని ప్రతిమలా నిలబడి
ఇరవై యేడు వసంతాలనుండి ఎదురుచూస్తున్నాను!
ఆకాశం కరుణిస్తుందని, అభ్యుదయాన్ని తెస్తుందని,
ఆకసం నాచేతి కందుతుందని,
అందాల హరివిల్లుపై కూర్చుందామని,
ఆశల హస్తాలు సాచి అనుక్షణం నిరీక్షిస్తున్నాను!
నా చేతుల్ని దాస్యశృంఖలాలు నాగుబాములై కరుస్తున్నప్పుడు,
నా గుండెలపై శ్వేత శార్దూలాలు
స్వైరవిహారం సలిపినప్పుడు,
స్వేచ్ఛా సమర హోమధూమంతో అంధకారం
నలుదిక్కుల అలుముకున్నప్పుడు,
బానిసబ్రతుకుల కాననంలో విప్లవాగ్ని
దావానలంలా చెలరేగినప్పుడు,
ఆకసంనుండి అవతరించాడు ఆపద్బాంధవుడు,
కొల్లాయిగుడ్డ కట్టుకొని, కర్రపోటు వేసుకొంటూ

భగవద్గీత, ఖురాను, బైబిలును పఠిస్తూ
రాముడు, రహీము, జీససు–
ప్రేమరసైకమూర్తులని వచిస్తూ,
నలుబదికోట్ల జనాళి నయనాశ్రువుల తుడిచి,
తనవెంట శాంతిపథంలో నడిపించిన 'ముసలితాత'
ఆనాడు.... ఒకనాడు.... అన్నాడు!
ఆకాశం దిగివస్తుందనీ, అందరినీ కరుణిస్తుందనీ!
వసుధపై స్వర్గధామం వెలుస్తుందనీ!
గంధర్వ యక్ష కిన్నరులు కల్పతరువును తెస్తారనీ!
అవనిపై మానవాళికి అమృతం లభిస్తుందనీ!!
అంతా నిజమనుకున్నాను! ఆశతో ఎదురు చూస్తున్నాను!
ఆకాశం దిగివచ్చి, అందరినీ ఓదారుస్తుందని,
నీలాకాశపు మణిదీపాలు నా నట్టింట వెలుగుతాయని
హరివిల్లు రంగులతో నాయిల్లు అద్దాలమహలుగా భాసిస్తుందని
ప్రభాతభానుని కిరణాలతో భాగ్యోదయవికాస మవుతుందని
చందమామ చల్లని వెన్నెలకాంతిలో
జగత్తు హాయిగ నిద్రిస్తుందని
పారిజాతాల పరిమళంతో పరవశత్వం లభిస్తుందని,
నందన వన చందన వృక్షచ్ఛాయలలో
అందరినీ శాంతి వరిస్తుందని.
నీలిమబ్బుల శీతలకరస్పర్శతో నిఖిలప్రకృతి వికసిస్తుందని,
దివ్యాప్సరోభామినీచరణమంజీరరవళిలో ధరిత్రిపులకిస్తుందని,
కలలుకన్నాను! గాలి మేడలు కట్టుకున్నాను!
ఇరవై యేడు వసంతాలనుండి ఎదురుచూస్తున్నాను!

ఆకాశం దిగిరాలేదు ! అనుక్షణం దూరమవుతున్నది !
అనంతవిశ్వాంతరాళపథంలో అదృశ్యమవుతున్నది !
నాచుట్టూ అభాగ్యులు, అనాథలు,
అన్నార్తులు, అమాయకులు !
నాచుట్టూ విషవలయాలు, విషభుజంగాలు, విషాన్న పుహత్యలు
నాచుట్టూ నిర్భాగ్యుల సజీవదహనాలు,
ఆకలిచావులు, మానభంగాలు
నాచుట్టూ నల్లనిసంపద కుడారాలు,
అధినేతల పదవుల విలాసమందిరాలు !
నాచుట్టూ క్షణక్షణాం పెరుగుతున్న ధరల
భయంకర పెనుభూతాలు !
నామెడకు ప్రతిక్షణం బిగుస్తున్న పన్నులశాసనాలఉరిత్రాళ్లు
నాకన్నులలో అనుక్షణం దిగుతున్న కులాలయిూటెలమొదళ్లు
నాగుండెలలో నిరంతరం మండుతున్న
అవినీతి, దోపిడీల అరనినెగళ్లు !
నేను జీససునుకాను ! నేను బుద్ధదేవుడనుకాను !
నేను పూజ్యబాపూజీనికాను !
నేను సామాన్యమానవుణ్ణి ! నివురుగప్పిన మహాగ్నిపర్వతాన్ని
నారక్తంలో ఎగిసిపడే స్వేచ్ఛావిహంగాలు !
నా అడుగులలో రక్తసిక్తభుజంగాలు !
నా నరాల విప్లవ విద్యుత్తరంగాలు !
నా కన్నుల క్రోధాగ్ని విస్ఫులింగాలు !
ఆకసం దిగిరాకపోతే, అనంతవిశ్వరూపందాల్చి
మానవేతిహాసంలో మహోజ్వలప్రళయం సృష్టిస్తాను !
విశ్వమానవ కళ్యాణానికి విజయభేరి మోగిస్తాను !

# వెలుగు

—ఆర్. కృష్ణకుమారి

ఆశయాలకు అందాల కోటకట్టే కాంతికిరణం,
అంతులేని ఉత్తేజం అందించగలిగిన ప్రేమైకప్రేరణం,
ఆధారం దొరకని ఏకాంతపయనంలో
ఆనందం పంచియిచ్చే దివ్యామృతకలశం,
అదే వెలుగుతున్నది చూడు— చిరుదీపం !
పెరుగుతున్న పరువుప్రతిష్టలవెనుక
తరుగుతున్న మానవత్వపు విలువలా కాదు—
అది వెలుగుతున్నది.
ఆర్థికసమస్యల పెళలచాటున
చల్లారిపోయిన సామాన్యుని చిల్లరభావాల్లా కాదు—
అది వెలుగుతున్నది.
ఆందోళనల బడబాగ్నిని భరించిభరించి
ఇప్పుడో, మరి కాసేపటికో
పగలబోయే యువతరంలా కాదు—
అది వెలుగుతున్నది.

సాటివాడికి చేయందించలేక, కలిమిని పంచలేక
నలుగురితో కలసిరాని పెద్దమనిషిని
రాజీకి రమ్మని ప్రాధేయపడుతున్న రాజకీయంలా కాదు—
అది వెలుగుతున్నది.

సామాజిక దురన్యాయాల్ని చూసి
ఆక్రోశాన్ని; ఉద్వేగాన్ని; అలజడిని ఆశ్రయించి
దగాపడి అభాగ్యులుగా నిలబడిపోయిన
జీవితాలనుచూసి హేళనగా పలకరించిన నవ్వులా కాదు—
అది వెలుగుతున్నది.

అనురాగనిలయ సామ్రాజ్యపు వుత్సవానికి
ఉజ్జ్వలంగా— ఎన్నడు వాడనిపువ్వుగా,
అందాలపసిపాప చిందించిన పన్నీటి బోసినవ్వులా,
మనిషి మనుగడకోసం, మనకోసం—
మంచినిపెంచే జీవితరేఖలకాంతిని చుట్టూరా ప్రసరింపజేస్తూ
మనమెక్కడవుంటే అక్కడే ఎప్పుడూజీవిస్తూ
నిత్యాగ్నిహోత్రంలా వెలుగుతూనేవుంటుంది;
వెలుగుతూనేవుంది
అదే - వెలుగుతున్నదిచూడు— చిరుదీపం!
నీ, నా— ఆశల సమూహాల ప్రతిరూపం!!

# ప్రాథమిక హక్కులు

— గుత్తికొండ సుబ్బారావు

బడాబడా ఖామందులంతా
లైసెన్సుల కుంభకోణంలో
కోట్లాదిరూపాయల కాస్తిపరులైతే
నోరుమూసుక్కూర్చోవడం, వీలైతే పంచుకోవడం
నా మొదటి ప్రాథమికహక్కు !

కోట్లాది సోదరమానవులు
ఆకలితో కడుపులు మాడి
గద్దలపై తిరగబడితే
చూస్తూ కూర్చోవడం, చేతనైతే అణగదొక్కడం
నా రెండవ ప్రాథమికహక్కు !

ఇచ్చిన వాగ్దానాలు
చెల్లించలేని అప్పులు
మట్టిగొట్టుక పోతున్నా
సర్వవేళలా నా ప్రభుతను కాపాడటమే
నా మూడో ప్రాథమిక హక్కు !

సోషలిజంపేర రాక్షసలిజమ్
స్వపరిపాలనపేర స్వాహాయపాలన
సెక్యులరిజమ్‌పేర మతదురహంకారం
సాగించే నాయకుల్ని బుజానేసుకోవడం
నా నాలుగో ప్రాథమిక హక్కు !

నా కిన్ని ప్రాథమికహక్కు లిచ్చి
ఉత్తమపౌరత్వలక్షణాల నలవర్చిన
నా రాజ్యాధిపతుల ఔదార్యాన్ని
వేనోళ్ళ కొనియాడటమే
నా ఆఖరి ప్రాథమిక హక్కు !



# తత్త్వమసి...తత్త్వమసి

విహారి & శాలివాహన

బాధని నీ నిఘంటువులోనుంచి తొలగించు,
లజ్జని నీ ఆలోచనలోకి రానీకు,
అభిమానం అంటే 'అబ్బే' నాకు లేదని చెప్పుకో,
అంతరాత్మని బ్రహ్మ అమర్చలేదనుకో—

ఇవన్నీ చేస్తేనే — నువ్,
పాలబూత్ లో, పాపాలబూత్ లో క్యూలో నిలబడగలుగుతావు;
ముక్కిపోయిన బియ్యం,
ముక్కూ-మొహంలేని నెయ్యం లొట్టలేస్తూ తినగలుగుతావు;

లక్ష వెచ్చించిన మంత్రిగారి సన్మానం,
వేయి వెచ్చించిన హరిదాసు సన్మానం,
లౌడ్ స్పీకర్లలో వినగలుగుతావు;
రిపోర్టులమీద వారాలతరబడి పార్లమెంటులో తర్జనభర్జనలు
మంత్రిపదవుల్లో కొందరికి ఆహ్వానాలు, కొందరికి విసర్జనలు—
దినపత్రికల్లో చదవగలుగుతావు;

ఆఫీసుల్లో కాగితాలపై బరువు,
బల్లకింద చేతుల్లో పరువు,
పబ్లిక్కుగా పంచగలుగుతావు;
అవినీతికి జరిగే ఆందోళననీ,
దానికి వ్యతిరేకంగా జరిగే గందరగోళాన్నీ
నిర్లిప్తంగా చూడగలుగుతావు;
భార్యామణి 'రిక్విజిషన్' చీటీని,
పావుకారు రేట్లతో చుట్టిన పీటీని.
అందుకుని గుటకలు మ్రింగగలుగుతావు;

ఇంతెందుకు,
ఇవన్నీ చేస్తేనే—నువ్
ఎవరైనా నీ మొహాన్న ఉమ్మేస్తే నిర్వికారంగా
తుడిచేసుకోగలుగుతావు!

'తత్వమసి'! 'తత్వమసి'!!

# రచయితల గురించి....

## శ్రీపతి

ఎస్. హెచ్. ఎస్. ప్రసాదరావు. జీవితభీమా సంస్థలో ఉద్యోగం. కథలు, కవితలు వ్రాస్తారు. కొన్నిగేయాలు ఆకాశవాణిద్వారా ప్రసారమయ్యాయి. సాంస్కృతికసంస్థల నిర్వహణలో భాగస్వాములు. నాటకానుభవజ్ఞుడు.

## రావ్ & యాజి

జంట రచయితలు: పూర్తిపేర్లు వి. వనకుశాలరావు, పువ్వాడ తిక్కనసోమయాజి. వీరి కథలు ఆంధ్రప్రభ, స్వాతి, జయశ్రీలలోను, కవితలు సమితి ప్రచురించిన "ఎర్రగులాబీలు"లోను ప్రచురితమైనాయి.

## గోపీకృష్ణ

పూర్తిపేరు యద్దనపూడి గోపాలకృష్ణప్రసాద్. 26సంవత్సరాలు. బి.ఏ. (లిట్) పట్టం పుచ్చుకున్నారు. ప్రస్తుతనివాసం మచిలీపట్నం. నాలుగేళ్ళుగా ఆంధ్రసారస్వతసమితి కార్యనిర్వాహకవర్గంలో వుంటున్నారు.

ఎల్. రామలింగేశ్వరరావు

28 సంవత్సరాలు, స్వస్థలం నూజివీడు. జీవిత భీమాసంస్థలో మచిలీపట్నం, వుద్యోగం. నటుడుకూడా. కథలు, కవితలు వ్రాస్తున్నారు. భీమావుద్యోగుల లలితకళాసమితి 1974 ఉగాది కవితాపఠనంలో ప్రథమ బహుమతి గ్రహీత.

మిరియాల వెంకటేశ్వరరావు

మచిలీపట్నం స్టేట్‌బ్యాంకులో వుద్యోగం. కథలు, కవితలు వ్రాస్తారు, గేయాలు కొన్ని ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. సాంస్కృతికసంస్థం నిర్వహణలో భాగస్వామ్యులు.

ఆంజనేయమూర్తి

విన్నకోట భక్త లక్ష్మీనారాయణమూర్తి. బి. కాం. ప్యాసయ్యారు. జననం విజయవాడలో. సాహిత్యాభిలాషి, నాటకకళలో అభినివేశం, సినారే గీతాలంటే పిచ్చిమోజు. ఉద్యోగం రాష్ట్రఎక్సైజ్‌శాఖలో-

కిరణ్ ప్రభ

పాతూరి ప్రభాకరరావు, బి. యస్.సి. ప్రస్తుతం యంయస్సీ. వార్తేయులో. కవితలల్లినా, కథలువ్రాసినా .. దీర్ఘజడత్వంనుండి యువతను మేల్కొలిపి, ద్విపాద పశుత్వంనుంచి మనిషిని మరల్చి, నవసమాజాన్ని నిర్మించడమే ధ్యేయం.

## బి. శ్రీనివాసగాంధి

పట్టభద్రులైన ఉపాధ్యాయులు- కథ, నవల, నాటకరచయిత. అభిమాన సాహిత్యప్రక్రియ వచనకవిత. కొన్నికథలు, కవితలు పత్రికల్లో వెలువడినై. నటులుకూడా. నివాసం మచిలీపట్నం.

## బూదరాజు శ్యామసుందర్

జననం 1934. బందరు ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీలో వుద్యోగం. పత్రికారంగంలో సబ్‌ఎడిటర్‌గా ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, ప్రజా ప్రభలలో అనుభవం. 1947 నుండి అన్ని రచనా ప్రక్రియల్లోనూ అభినివేశం. ప్రస్తుతం ఆంధ్ర సారస్వతసమితి సంయుక్త కార్యదర్శి.

## పాదర్తి కోటయ్య

జననం 15-7-1930 ప్రకాశంజిల్లా అమ్మనబ్రోలు. మచిలీపట్నం, జీవితబీమాసంస్థలో వుద్యోగం. రచయిత, నటుడు, ప్రయోక్త, ట్రేడ్ యూనియన్ కార్యకర్త. అభ్యుదయ రచనలంటే అభిమానం.

## కాళేపల్లి యోగేశ్వరరావు

జననం, విద్యాభ్యాసం, వుద్యోగం బందరులోనే. హిందీలో సాహిత్య రత్న పట్టం పుచ్చుకున్నారు. కవితలు, కథలు, వ్యాసాలు వ్రాస్తున్నారు. చిత్రకారుడు. జీవితబీమా వుద్యోగుల లలితకళాసమితిద్వారా అనేక సాహితీ ప్రక్రియల్లో బహుమతులు పొందారు.

## చిట్టా రామకృష్ణారావు

జననం చిరిచింతల (కృష్ణాజిల్లా) 1-7-1912. విద్వాన్, బి. ఏ., బి. ఇడి. ఉపాధ్యాయవృత్తిచేసివిరమించిరి. ప్రాచీన అర్వాచీన సాహిత్యములయందు అభిరుచి కలవారు. ఆంధ్రసాహిత్యమునందుగల దాదాపు అన్నిపక్రియలలో 20గ్రంథములు వ్రాసిరి. 1947లో రాయలసీమ కళా పరిషత్తు వారు హిందుపురమునందు కవిభూషణబిరుదునిచ్చి సత్కరించిరి.

## స్వర్ణ రాజ హనుమంతరావు

తెలుగుసాహిత్యంలో యం. ఏ. పట్టభద్రులు. బందరు నోబుల్ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. "ధారాపాత్రి" కవితాసంపుటి, పెక్కు నాటికలు, ఒక కథాసంపుటి ప్రచురితమైనవి. నాటక ప్రక్రియపై ప్రత్యేకాభిమానం. నాట్యావధానం చేస్తున్నారు.

## కోడూరు శ్రీ పాండురంగారావు.

ఉద్యోగం జిల్లా స్టాటిస్టికల్ ఆఫీసులో-బందరు. సాహిత్యాభిమానం అమితం. సాంస్కృతిక కార్యకలాపాల్లో పాల్గొనటమంటేఇష్టం. కలం కదిలింది ఈమధ్యనే "జయశ్రీ" లోను, ఆంగ్లవారపత్రిక "ఆర్గనైజర్" లోను వీరి రచనలు ప్రచురిత మయ్యాయి.

## జె. యస్. ఆర్. కె. ప్రసాదరావు

జననం, విద్యాభ్యాసం, వుద్యోగం బందరులోనే. కొన్ని కవితలు, కథలు వివిధపత్రికల్లో అచ్చయ్యాయి. కొన్నికవితలు "ఆకాశవాణి"లో ప్రసారమయ్యాయి. ఆకాశవాణి ఆనంద ఉగాది యువకవి సమ్మేళనంలో పాల్గొన్నారు. సమితి కార్యనిర్వాహకవర్గ సభ్యుడు.

విజయమూర్తి

అసలుపేరు ఎం. ఏ. వి. ప్రసాదరావు. జననం 1934. స్వస్థలం ఏలూరు. ప్రస్తుతవుద్యోగం మచిలీపట్నం జీవితభీమాసంస్థ. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, ప్రగతి, కృష్ణాపత్రిక, జ్యోతి యిత్యాదుల్లో చాలాకథలు, కవితలు ప్రచురింపబడ్డాయి, నటుడు, ప్రయోక్త.

పి. చిరంజీవినీకుమారి

కాకినాడ రంగరాయ మెడికల్ కాలేజీలో ఆంగ్లోపన్యాసకురు. "రామాయణంలో సామాజిక స్పృహ"ను చూపి డాక్టరేట్‌పట్టం పుచ్చుకున్నారు. "ఆగమసంగీతం కవితాసంపుటి కథలు—గాథలు" (రష్యన్ కథలకు ఆంధ్రానువాదం) ప్రకటించబడ్డాయి సాహిత్య, సాంస్కృతిక సంస్థల కార్యనిర్వహణానుభవం.

జి. సత్యనారాయణ ఎం. ఏ.

"ముప్పైఎనిమిది వసంతాలు గడచిన జీవితంలో పుట్టినదీ, పెరిగినదీ పట్టభద్రుడు అయినదీ చీరాలలో. ఉద్యోగం జీవితభీమాసంస్థలో. ఉంటున్నది బందరులో. ఉత్తేజం వచన కవితా రచనలో. ఉత్సాహం సమాజ శ్రేయస్సులో".

ఆర్. కృష్ణకుమారి

పట్టభద్రురాలు. కథలు, కవితలు వ్రాస్తారు. కొన్ని కవితలు ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి. చిత్రలేఖనంలో కృషిచేస్తున్నారు. నివాసం మచిలీపట్టణం.

గుత్తికొండ సుబ్బారావు

జననం 1946. మచిలీపట్నం జీవితభీమాసంస్థలో వుద్యోగం. "వేకువ" సాహిత్య త్రైమాసపత్రిక సంస్థాపకనిర్వహణ, "ఫీవర్స్ ఫ్రింట్" "స్పందనసాహితి" కార్యనిర్వహణానుభవం. ప్రస్తుతం ఆంధ్ర సారస్వతసమితి కార్యదర్శి.

విహారి & శాలివాహన

ప్రసిద్ధులైన జంట రచయితలు. ఎల్. ఐ. సి. లో (ఇందరు) ఉద్యోగులు. 5 నవలలు, రెండు కథాసంపుటాలూ, ఒక కవితాసంపుటి వెలువడినై. సుమారు 150 కథలు, పది నాటికలు, ఆరు నవలలు, వివిధ ప్రముఖ పత్రికల్లోనూ ప్రచురితమైనాయి. కొన్ని రచనలు ఆకాశవాణిలో ప్రసారమైనాయి.



